చదువరు లారా !

ఇందు నెరసులున్న చక్కజేసికొని యుపయోగింపుడు.

విధేయుడు.
అనకాపల్లి బీ. బాలాజీదాసుడు.

# ప్రకటన.

ఇందు గల పుస్తకములు వలయు వారు విశాఖపట్టణ జిల్లా అనకాపల్లి వాసుండగు బీ. బాలాజీదాసునకు వ్రాసిన నచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ప్రియంవద | రూ | 0 | 6 | 0 |
| 2 | జయప్రద | | 0 | 6 | 0 |
| 3 | సీతా కల్యాణము | | 0 | 6 | 0 |
| 4 | గయోపాఖ్యానము | | 0 | 6 | 0 |
| 5 | త్రిశంకు విజయము | | 0 | 6 | 0 |
| 6 | నల చరిత్ర | | 0 | 6 | 0 |
| 7 | ద్రౌపదీ మానసంరక్షణము | | 0 | 4 | 0 |
| 8 | కర్ణానంద దాయిని | | 0 | 4 | 0 |
| 9 | హరికథా యితిహాసమంజరి మొదటి భాగము | | 0 | 4 | 0 |
| 10 | డిటో రెండవభాగము | | 0 | 4 | 0 |
| 11 | సూరదాసు చరిత్ర | | 0 | 4 | 0 |
| 12 | బాలసుందర. మద్దిరంగనాయక రచితము | | 0 | 4 | 0 |
| 13 | సారంగధర. సూర్యనారాయణ రచితము | | 0 | 6 | 0 |
| 14 | కుచేలోపాఖ్యానము. సుదర్శనదాసు రచితము | | 0 | 8 | 0 |
| 15 | కర్ణ చరిత్ర డిటో | | 0 | 8 | 0 |

మిత్రులారా !

వ. జీవకోటిలో నరజన్మ ముత్తమమని మీ రెరింగినదె యిట్టి జన్మ మెత్తినందుకు ఆనంద స్వరూపుండగు భగవంతుని దయనొందుటకై తగు ప్రయత్నించుట అవస్యకము, మఱియు, సుజనులయెడ వినయము బీదలయెడ కనికరము దేవునియందు ప్రపత్తి మాటల యందు నిజము నెరపిన నరుండు సద్గతి నొందగలడు చూడుడు. మున్ను సత్యవ్రతంబూని యశ మొందిన హరిశ్చంద్ర చక్రవర్తిచరిత్ర మీ క్రింద పొందు పర్చెద సావధానచిత్తుల రయివిన్న వెరసుల నావలంద్రోసి యానందించి మన్నింపవేడుచుంటి.

వ. సకల సంపదల కునికిపట్టగు అయోధ్యాపురంబొకటి కలదు దానిని హరిశ్చంద్రుండేలుచు చంద్రమతియను సాధ్వీమణిని బరిణయమై, పుత్రకునిగని లోహితాస్యుండను నామంబిడి దినములు గడుపుచుండ, స్వర్గపట్టణమున సింహాసనాధీశుండై యున్న దేవేంద్రుండు.

సావేరి—చతురశ్రగతి.

మునులార ? కనుడి మోదంబున వినుడి॥ ము॥
అనవరతము బాలాజిదాసు లాచరింపదగిన తేటమాట॥ ము॥
భూలోకంబున మీ రెరుగని నర పాలురెవరు లెరు, వేమారు॥ ము॥
చనువున నడిగితి మానవలోకంబున భూతవర్తమాన నృపులలో
నన్రుతంబాడని వారలున్న యెడ నాలకింపవేడుక య్యె దెల్పుడో॥

వ. యిట్లు యింద్రుండడుగ తాపసు లొకరిమొగంబొకరు చూచుచున్న తఱి తపోధనుండును మునికుల శ్రేష్టుండును భూతభవిష్య ద్వర్తమానవేదియగు వశిష్ఠుండు సంక్రందను నాలోకించి.

తో. ఆకర్ణింపుము పర్వతభేదీ ! ఆర్యానుకూలన !
క్షేకర్తైను నరలోకములోన హరిశ్చంద్ర చక్రవర్తి
శివునిపద సరోజంబుల సాక్షిగ జెప్పెద త్రిశంకునకు
లవమాత్రము దప్పు నాడ దెప్పుడు రవికుల ప్రభూతుండు.

వ. ఇట్లరుంధతీ రమణుండు పలుక. గాధినందనుండువిని కనులెఱ్ఱజేసి పదఘట్టనం బొనర్చుచు.

సీ. తమ శరీరమువంచి తపంబాచరింపడ లేక విద్యకు నాముంబువెట్టిపెట్టి॥
ఘనపాండితీశక్తి గనలేక విబుధుల పొపొమ్మనుచు నిట్టబొంచి

పొంచి । సాని పాపలతోడ సరసంబులాడుటకై తమ మాన్యమ్ము లమ్మి యమ్మి । సారాయిత్రాంది సీసాలకొలది త్రావి మితిలేని మాంసము మెక్కి మెక్కి.

గీ॥ సుకృత కార్యమ్ములకు సున్న చుట్టి చుట్టి
చెడుగుపనులకు ముందుగ నడిచి నడిచి
కండక్రొవ్వున కాలమ్ము గడుపుచుండు
నేలమగలేడ సత్యమ్ము నెఱపులేడ.

వ. ఇట్లనగా వశిష్ఠుండు నవ్వి గాధేయు నాలోకించి.

బేహాగ్—ఆది తాళము.

వినుగాధినందన
వను గల్వ లేడు మాటలిచట పనికిరావు నే చెఱుంగుదు నిలావు॥ వి॥
పిచ్చుక గరుడునితో సరియన వచ్చున దబ్బరలాడు రాచ
ముచ్చుల త్రైశంకునితో సమమన వచ్చున బాలాజి మెచ్చున॥ వి॥

వ. మఱియు వాని వర్తన వినుము.

సీ. కొక్కురోకో యను కోడి కూసిన యంత స్నానంబుగావించి సంధ్యవార్చి । భూవనిసురులపాదమర్చించి పిమ్మట నైదుగీతుల తిండినారగించి । విశ్రమింబుగొంత సడిస్నిద్రగావించి తరువాత లేచి యాస్థానమునకు । జని రాజ్యకార్యముల్ చక్కగ నవరించి సత్పాంథ తాళిని సత్కరించి.

గీ. కాలమును ద్రోయుచుండు నాఘునయశుండు
పద్మపత్ర హితాన్వయ పావనుండు
అఖిల విద్యాధరుండు సత్యవ్రతుండు
శాంతమూర్తి హరిశ్చంద్ర చక్రవర్తి.

వ. ఇట్టి సుగుణవంతుడగు హరిశ్చంద్రుండు కల్లలాడు టెక్కడ నామాటవిని యిట్టి పట్టుదలపిడిచి నిగాగవము చిక్కించుకొనుట మంచిదియని విశ్వామిత్రుండరుణలోచనుండై పండ్లు పటపట గొఱుకుచు.

ఉ. హా యిది యేమి చిత్రము నరాధిపులెప్పుడు దప్పనాతిలా
గ్యాయరె? నోరుమూయుము గనుంగొను మత్తులువిప్పి నేను గా

ధేయుడ భానునందన రతి ప్రియ పద్మజ నీలకంఠ నా
రాయణులైన నాకెదురు రాగల రే మదినేన యల్గినన్.

కమాచి—ఆది తాళము.

మానరా మునికుల నికృష్టా యో మాకు వశిష్ఠా॥ మాన॥
మానవాధముండగు త్రిశంకు కుమాట దప్పనాడడనుచు నుప్పుట॥
అలవింధ్యాచల గర్వంబణచిన కలశోద్భవుండు భ్రామిను
కులనేర్పరచిన శ్రీపరాశరుని కార్మ్యె కొమరుకుండ బలారిని
వలుకబూని నేసిలంచిన యుహ్హా ల్యావల్లభుకుండ బురారిని
చులుకనగ నెంచి యరకాలిక్షణ్ణ జూపిన భృగుపుండు దపస్సున
నలువను శిరస్సు రించిన గాధితనయుడను నేనుండ శాలాజిని
నలలితముగ నేలిన శివపాదీం బుల నిరతము స్మరియించెడి యూవే
ల్పుల దొరిదండ సకలదివిజులుండ బలుగొప్పవాడ నీవనికొనియిట
బలుకు చుంటివిచ్చోట నీమాట పనికిరాదు పనికిరాదు పనికిరాదు॥

వ. ఇట్లు గాధేయుండన వశిష్ఠుడు నవ్వి.

సీ. కడమటికొండపై భానుండువొడమిన దిమ్మపుట్టువు వ్రాతతప్పిచనిన।
కులధారుణీధరంబులు మేరమీరిన స్వాహావధూజాని చల్లనైన।
హేమాచలం బది భూమిలో గృంగిన దిల క్రిందుగా జగత్రయము
వడిన। చదలపై గ్రహముల సంచారముడిగిన బ్రాయేలు లేపు
నిర్జలములైన.

గీ. మిన్ను విరిగిన దారలు మింటనుండి
నేలరాలిన నల్ల భూపాలు డెప్పుడు
తప్పనాడడు సిబెట్టిదములు పలికి
ఇంతతో నీ గౌరవమ్ము దక్కించుకొనుము.

వ. ఇట్లరుంధతీ రమణుండు పలుక గాధినందనుండు రంగు [illegible] చు నేనాదుక్షీ
లునిచే దబ్బరలాడించెద మఱియు బ్రాహ్మణుగ నుండుమని బోధింపవచ్చునుగాని పందె
మేమియో యాసునాసీరుని ముందు వెల్లడింపుమన వశిష్ఠుండు నవ్వి.

శో. ప్రత్యేకము సెప్పనేల భూపతి ప్రథనంబొంటకు మొదటి
సత్యవ్రతుడప్ప గిమ్మని వాణీజానివ్రాసె నెన్నుదుట.

కుం జనిరి వశిష్ఠకౌశికుల కోపంబు లంతరంగంబుల గాపురంబుసేయ దమ తమ నెలవులం జేరిరి హరిశ్చంద్రుం డొకనాడు సూర్యునిపై జూడ్కినిల్పి యర్ఘ్యమిచ్చుచు మనమ్మున.

సీ. ఛాయావధూ మనస్సార సభృంగమా! శర్వరథాంగమా! శరణు
శరణు। పరమభక్తార్పిత పాయసాన్నప్రియా! సద్గుణసముదయా! శరణు శరణు। ఆశ్రితభక్త ఘోరాఘవారణ సృణీ! గుణవిజయత్వద
మణీ! శరణు శరణు। పృథురత్నమయ రథాన్విత హరి త్రైనాథ
. వా! శతపత్ర బాంధవా! శరణు శరణు.

గీ. సర్వలోక సంస్తవనీయ శరణు శరణు
శౌరిపద్మజా భవరూప శరణు శరణు
నిరుపమాన నిర్మలకరా శరణు శరణు
పాహిమాం పాహిమాం పాహి పాహి శరణు.

వ. ఇట్లర్ఘ్యమిచ్చు సమయంబున గాధేయుండరుదెంచి దద్వారమ్ము యొజెంగి ముందుగ జని నమస్కరింప కపట మనమ్మున గాధిబాలి నవ్వుచు.

గీ. గతయుగమ్మున నెయ్యది ఘనత కెక్కె
అఖిల కవిపుంగవుల నెద్ది యాశ్రయించె
పుణ్యజనులు దేనిగని విమోహపడుదు
రట్టిదేవత నిన్ను జేపట్టుగాత.

వ. అని దీవింప త్రైశంకవుండు మహాప్రసాదము ధన్యుండనైతి నీ వంటి మిత్రుండనైతి మీరాక కారణంబెఱింగించిన నీదాసుండా తెఱంగున జేయంగలడన కౌశికుండు నవ్వి.

తే. శివునకు బ్రీతిగ నేనొక్క క్రతువు జేయబూని దీక్షితిని
రవికుల తిలకా! దానికై గొంతద్రవ్య మడుగ వచ్చితిని.

వ. కావున మూడు భారముల ద్రవ్యమిచ్చిన నాసంకల్పము సంపూర్తి కాగలదన విని ధనాగారమ్మునంగల ద్రవ్యముకావలసినంత పుచ్చుకొమ్మని హరిశ్చంద్రుండు వలుక గాధేయుం డాశ్చర్యమంది త్రిశంకునందనా! మాకు నీవంటిదాత యుండ లోపంబులేదు మాకవసరము వచ్చి నప్పుడడిగెద నంతదాక నీచెంతనుంచుమని గాధేయుండు చన జంద్రమతీ ప్రియుండు మనమ్మున.

నాదనామక్రియ—ఆది తాళము.

నేనేమి సేయుదా నిరాధారి చవియెను॥ నే॥

నే నొసంగినట్టి ద్రవ్యచయమా మౌనీంద్రుడు దీసికొని చనినచో
నాగచర్మ వసనుని స్మరింపుచు నానగరమ్మున నుండుహోయిగ॥ నే॥
ఆతడల్గిన శంకరాదులైన భ యంపడుదురు ఋణముంచిచనియొనే
తలినడుగునె తెలియదు బాలాజీ దాసావనుడెఱుగు నీమఱుగు॥ నే॥

వ. ఈగతి చింతించు తతి విశ్వామిత్రకల్పితంబగు జంతువులబాధ సహింపలేక కాపు వాండ్రు ప్రభువు నాలోకించి చేతులు జోడించి.

నాదనామక్రియ—త్రిశ్రగతి

వేలేలేలేలే లేరాజా! పింతమోకము లరుదెంచెవినుమోమహోరాజా!॥
నేల యీనినట్లు పెద్ద వాలుమొకము లరుదెంచె॥ వే॥
పైరులన్ని మేసి పరుగున మముజూసి
ప్రాణానికి గాసి పరచెను గుణరాశి
కొలగి గుడ్డపేలిక లో వచ్చితిమి చాలక
నిలువలేము పాలికాపుల గావు మేలిక
నాటిజంపకున్న నీరా పాటికేగమున్న యీ
పూటమాకుబస్తు కట్టబోమిక మీాశిస్తు॥ వే॥

వ. ఇట్లు విన్నపింప నరేంద్రుండు వారలకుం గలవంతదీర్చెదనని యభయం బొసంగి భార్యనవలోకించి నాటిమిన్నా! వేట కొఱకై వింధ్యాటవీతీరమునకుం జనవలసి వచ్చినదన విని సతీతిలకంబాశ్చర్యం బంది.

కేదారము—త్రిపుట తాళము.

ఇంత యనిచ్చినిపు వేట యేలరా? యో భూమిపాలిటా॥ యింత॥
వింతదోచె సకిల భూతి వితతిని మీాప్రాణముగతి భా
వింతురుగద సదా విమతమదవిదార పరమోదార రుచిజితమార॥
ఇనకులప్రదీప! జీవ హింసకులు బీ బాలాజీవర
మని సత్కరుణకు బాత్రులుగారనిగదా నుంసవర్జితుండవై తి॥విం॥

వ. ఇట్లన ప్రేయసీ! జంతుబాధచే వంతనొందు ప్రజలకు వాగ్దాన మొసంగుట చే కాగడవికి జనవలసివచ్చినదన జంద్రమతి విని నాథా! యడవి జూడ వేడుక బొడమి యున్నది గాన నే నరుదెంచెద ననిబల్క నేలనుగంతు సతీసుతి సమేతుండయి విపినం

బునకేతెంచి జంతువులనంతఁపుచ్చి కాపులబాధ మాన్పి మఱల నింటికివచ్చుచు మార్గ మధ్యమున విశ్వామిత్ర ప్రేరితంబగు.

సీ. ఇంద్రనీలపు గాంతినేలు కన్నులతోడ ముగ్గులుగుల్కు నెమ్మోముతోడ। పగడాల జిగిమాపదగు వీనుగవతోడ గడునల్లనైన శృంగములతోడ। ముత్తియమ్ముల సౌరునొత్తు చాలులతోడ నపరంజనేలు మేని పసతోడ। మగరాలక్రొందళ్కు నగులోద్దొడలతోడ బుఱుత జాళ్లిడాల్కుడుపుతోడ.

గీ. దొడ్డ డెక్కలతో బొట్టి తోకతోడ
గాలిఁపేరెమ్ము నడచు వేగమ్ముతోడ
బిత్తరపు జూపుతో నేలన త్రియ త్త
నటుల వడిజింకరాగ జేడ్పట్టఁచూచి.

వ. విస్మయమంది భార్యకుం జూపుచుండునంత లోహితా కుమారుండు గాని నవ లోకించి తండ్రిని బిలిచి.

నాదనామక్రియ—ఆది తాళము.

బాబా! చూడుమా వచ్చుచున్న పసిడి యిఱ్ఱిని। బాబా।
శ్రీ బాలాజీవరదుని చేతనున్న నాకరీతిదిది॥ బాబా॥
చూడు చూడు దాని సోయగమ్ము నేడు లేడిదెచ్చియిచ్చిన నా
మేడచిడి మీదగట్టి పచ్చిక మేసి దానితోడ నాడుదు॥ బాబా॥
కోటలోన నున్న జానకదీనికి సాటిగాదు గనుము దానవారి
బూటకమ్ముగాదు తేకయున్న బువ్వదినుట నేడు నున్న। బాబా॥

వ. ఈరీతి నడుగు కొమరుని ముచ్చటదీర్ప నెంచి భూపాలుండు వెఱ్ఱియై యిఱ్ఱి వెంటనంటిజన నది కౌశికుని యాశ్రమమంబునకు జని మాయచయ్యి నంతపల్లన కల్పితంబగు శయ్యపై జంద్రమతీ యూరుపీఠంబున శిరమునుంచి నిద్రించు తత్సతీతిలకము చిగురు టాకులతో జేయంబడిన వీవనచే చల్లనిగాలిసోకునటుల మెల్లన వీచుచుండగా భూవల్లభుండు చెడుగు కలగని దిగ్గునలేచి గడగడవడకుచు గన్నీరు విడుచుచు భార్య నాలోకించి.

కైకవసు—ఆది తాళము.

ఏమని దెల్పుదునో చెలి యీరా!॥ ఏమ॥

సోమనిభాస్యా! నామనో రహస్య॥ మే॥
కొలువున బెద్దలుగూడియుండ దలమీది రత్నకలిత కిరీట
మిలగూలినట్టుల దన్ని కేశ ములబట్టి యూరివెలపల కీడ్చిన
పలువిధముల బాధలనుభవించి పదపడి బాలాజీవరదుని కృప
విలువలేని సౌఖ్యమొందినట్టుల కలగంటి నాకొంటికృతమిదియాటి॥

వ. ఇట్లని కడు చింతింపుచున్న సాధ్వీమణి విని మిగులభయమునొంది పద్మాక్షి భయములేని దానివలె నటించి వల్లభా కల కల్లనిదెలిసియు నిట్లు జింతింపం బాడియే ధైర్యమూనుండని పలుక నామాటనమ్మక రాజు మిగుల బొగులుచున్నంత నక్కటా మక్కువ కాడు మిక్కిలి బొక్కుచున్నాడు దుఃఖమును బోదోలు మహిమగల గానవిద్యా ప్రవీణు లెవ్వరయినవచ్చి పాటబాడి రాచమేటివిచారమాపిన బాగయుండునని యండజయాన యోచింప విశ్వామిత్ర కల్పితంబగు మాలకన్నియ లిర్వురు.

సీ. సాంబ్రాణి తైలమ్ము చరిమి కొప్పులువెట్టి కడుదావిగల పూలు ముడిచి ముడిచి। కనుదమ్ములకు కాటుకలువెట్టి కస్తూరి తిలకమ్ము నునుసుల దిద్ది దిద్ది। వింతచీరలగట్టి విలువసొమ్ములువెట్టి తోరంపు గుబుసముల్ తొడిగి తొడిగి॥ ఎవ్వేళ బలుతావులీను తైలమ్ముల బునుగు నెమ్మేనుల బూసి పూసి.

గీ. చలువ జేసన చేయుమాల్లెలమిబట్టి
తగిన తాళి జంత్రముల హస్తములబట్టి
వయసువారికి నేత్ర పర్వమగునటుల
మాలెతలువచ్చి భూపతిమ్రోల నిలిచి.

హిం॥ భయిరవి—త్రిశ్రగతి.

రాజశేఖరా! రిపు రాజ భీకరా ! ॥రా॥
ధీజనానుకూలా! దినేంద్రకుల శీలా!
మచ్చికతో భవదీయ సమక్షంబున బాటబాడ
వచ్చినాము బాలా శుభ స్వా! గానానురక్త ॥ రా॥

వ. ఇట్లు మాలగరితలన నేలనుగడు వారలంగని మీమీ విద్యాకౌశల మిప్పట్టున వెల్లడింపుండన వల్లెయని పల్లవాధరలు భూవల్లభునిపై దృష్టినిల్పి హస్తవిన్యాస మొనర్చుచు.

హిం-భైరవి—త్రిశ్రగతి.

ఉఠో ప్రియా! జాగో జీయొకేలిడరుంలాగి॥ వు॥
గజరగజరామైనపేని ప్రియా! ధర్మజాగో
సోతిథిమై నీంద్కేమారె గజరాచోర్ చునాలియా॥ వు॥

వ. ఈగతి గానమొనరింప నా హరిశ్చంద్రుండు సంతసించి కొంత ద్రవ్యంబొసంగ వారోసంగి పడంతులు నగుచు నరనాయకు నవలోకించి.

గీ. ఏమి చెప్పెదుమయ్యా పూర్వోమరమున
మమ్ము బాధింపుచున్నాడు మన్మథుండు
సందిటం జేర్చి కడు సంతసమటున మమ్ము
గూడినంజాలు నదియె నూకు బదివేలు

వ. ఇట్లు చండాలకన్య లనుగ భూవల్లభుండు హరహరాయని చెవులు మూసికొని చెలందులారా! నేనేకపత్నీ వ్రతుండనగుట మీ యభీష్టము దీర్ప నవకాశము లేదు గాన నింతటితో తృప్తినొందిపొండన వారలు మాకోరిక దీర్పకున్న నీనగలు విత్తమవసరము లేదని రాజును వంచించుటకై శృంగార చేష్టలనేకముగా జేయదొడంగిన నృపాలుండరయాలోచనుండై కొరడా చేబూని వారలబాధింప నరుదెంచు సమయమ్మున సత్యకీర్తి హరిశ్చంద్రుని చేయి బట్టికొని.

చ. అబలలబట్టి కొట్టుటకునై కొరడాకై బూని వచ్చుటల్
సబబనిదోచెనే? సతులునై పురుడే కశదాడనంబు వై
రిబలమదంబణంచి కడలేనియశమ్ము గ్రహించుటుర్విలో
సొబగు నృపాధినాధులకు సూర్యకులాంబుధి పూర్ణచంద్రమా!

వ. ఇట్లని నృపతికిం గల కోపంబు వారింప నంత చండాలకన్య లిట్లు రొకరితో నొకరు.

కాఫి—ఆది తాళము.

ఏలామనకు వానిజోలి చెలి॥ యేలా॥
పూలవిల్తుకేలో నేలుమనుచు బ్రతి
మాలిన మన కను కూల పడడయ్యె నిక॥ యేలా॥
అల బాలాజీవరమునై చలిమలపట్టి విభునిట్లో
దులదూగు గాధేయునిట్లో దెలుపుదము కలికి నగుములికి॥ యే॥

వ. ఈగతి ననికొని కొప్పులువిప్పి గాజులు బ్రద్దలగొట్టి మేనెల్లరక్కుకొని వీత రాంగులై। నాతులే తెంచి గాధేయు నవలోకించి.

తో. జనకా! యేమనిదెల్పుదు మాభూజాని చాలకోపమునన్
కనికరింపకయె మమ్ములగొట్టెనునుగొను మామాయొడలన్.

వ. ఇట్లా మాలచిగురు బోండ్లు విన్నవింప గాధిచూలి చిందులు ద్రొక్కుచు నేమేమీ నృపాధముండు మిమ్ముల బాధించెనా? సరి సరి నా కోపాగ్నిని వాడే తెఱంగున భరించునో చూచెదనని చట్టున వచ్చి కిరీటము నెడమ పాదమ్ముల నేలగూలినటుల దన్న నా మన్ను తేడు క్రన్నసవచ్చి మౌని పాదమును బట్టి.

ఉ. ఎంతటి నొప్పిపట్టినదొ హీరమణీమయమౌ కిరీట మ
త్యంతముదాక మీమృదుపదాంబుజమో కుశికాత్మజాత మీ
రింతటి యల్కబూనుటకు నేనొనరించిన కోపమేమియో
శాంతివహించి మానకుల చంద్రమ తెల్పవె మీకు మ్రొక్కెదన్.

వ. ఇత్తెఱంగున హరిశ్చంద్రుండన గాధేయుండు గన్నుల నిప్పులు రాల్చుచు బద ఘట్టన మొనర్చి.

భైరవి—ఆది తాళము.

వినుమోరినిపవ రాధివిగావటరా నృపా॥ విను॥
ఇవకులాధమా ప్రాజ్ఞుడవని మనమునదలచియుంటినోరికొంటి॥ విను॥
పుడమీశులు లేరో? వేటకై యడవులకుంబోరో? యీ
పడతులపై యనుకంపవహింపక బట్టితివట తిట్టితివట కొట్టితివట।
తులువా! నాతోటకరుదెంచి జంతువుల గీటడంచి మఱి
నలపసిడీ యిట్టినెంటనంటి యీ యాసముగలిగించి కడు
నలుకబూని నాముద్దుకూతుల నటమట నొందించియుంటి విక
బోలగి యెటులబోయెదవు బాలాజని పలుమరు రక్షించినట్టి యీ
జలజారిమాళి నీకు దోడ్పడిన జడువనురా? విడువనురా?యిదివినరా॥

వ. కౌశికుండిట్లన రాజు భయ భ్రాంతుండై కరములు మోడ్చి.

గీ. కొడుకు లవివేకులై చేయునడుకు లెల్ల
సైపరే? తల్లిదండ్రులు సంయమీంద్ర

కోయుదురె తూటికూర వజ్రాయుధమున
గోప మీరీతిజూపిన నోపగిలనె?

వ. కావున నాతప్పులు సైరింపుండన గాధి నందనుండు విని నవ్వుచు భళిరా హరిశ్చంద్రా నీపయి మాకు దయవచ్చినది.

ఉ॥ చూడు మదీయ పుత్రికల సుందరత న్గొనగోటికైన నీ
మూడు జగంబులందు సరిబోలరు స్త్రీలెవరైన మారుమా
టాడక నీలతాంగుల దయన్గొని కౌగిట జేర్చి వారలన్
గూడితివేని నిన్ను నలగోపతి గద్దియపైని నిల్పెదన్.

వ. ఇట్లన జంద్రమతీ ప్రియుండు గాధేయుం గని.

క. కులమున గల ధర్మంబా
వలనిడి మా లెతలగూడి స్వర్లోకసుఖం
బులనెల్ల నెంత జెప్పిన
గల రాజ్యంబైన విడుతుగాని మునీంద్రా!

వ. ఈరీతి భూపాలుండన నగ్గాధిసుతుం డాతనిం గని.

కల్యాణి—ఆది తాళము.

మాట దాటరాదు నీవన్న॥ మాట॥
నూటిగ బాలాజినేలిన గంగా జూటిని సదమాన ముజ్జగాన॥మాట॥
మనుజనాథ! నీరాజ్యము మాకు సమర్పించిపొమ్ముకినుమువిడినమ్ము
జనులకానవాలుగనీముద్రికసరగనిమ్ము చిరసుఖమ్ముగలుగునజమ్ము॥

వ. గాధి నందనుండిట్లన రాజు నవ్వుచు.

ఉ. పంటవలంతినేలి పిదపం దపమొంతయొ జేసి యిప్డు మీ
రుంటిరి ముజ్జగంబుల యశోన్నతులై యిది మాని క్రమ్మఱ
దొంటి యవస్థనుండ మదిదోచిన బ్రాహ్మణదత్తమైన మ
న్నంటక దక్కు రాజ్యరమనంతయునిచ్చెద కొనుమో తపోధనా!

వ. ఇట్లని రాజ్యము దారవోయ నతని సాహసమునకు గాధేయుం డాశ్చర్యమంది రాజా! హరిశ్చంద్ర! నీరాజ్య రమనమా కొసంగితివి గాన నా స్వాధీనముందున్న భూ

మిలో నీవుపుండగూడదు గాన నిచ్చటి నుంచి బొమ్మనవల్లెయని పుత్రకళత్ర సమన్వితుం డయి యడవికి బోవ నుద్యోగించు సమయంబున గౌశికుండాతనింగని రాజా! నాడు యజ్ఞార్థమై వాగ్దత్త మొనర్చిన ద్రవ్యంబిప్పు డొసంగు మన హరిశ్చంద్రుండు విని ముని కుంజరా! రాజ్య మంతయు మీకు సమర్పించి బడుగునై యుండ నింతటితో దనివి జెం దక ఋణము మీద నుంచుట జెల్లునా యన గాధి చూలి కన్ను లెఱ్ఱజేసి భూపా! కొంచ మైన యోచింపక నిట్లు బలికినందుకు వింతగా నున్నది

తో. ఈరాజ్యము సవనము జేయుటకై యిచ్చితివేమో చెప్పు
మోరాజా! సత్యమ్ము నిల్పుకొన నూహయున్న నిడు మప్పు
యించుకైన మనమున దలపోయక నీగతిబల్కుట దగునా
మంచిది చెల్పుము మాఋణమెపుడు స మర్పించెదవో సుగుణా!

వ. ఇట్లు గాగి సుతుండన జంద్రమతీ ప్రియుం డవలోకించి.

తో. ఓ దయానిధి! ముప్పది దినముల లోదీర్చెద మీ ఋణము
ఆదివసంబున కీయకున్న నన్నమ్మి గొనుడు మీధనము.

వ. ఇట్లు హరిశ్చంద్రుండన గాధి పుత్రుండంగీకరించి నక్షత్రకా! యిటు రమ్ము వీని వెంటబొమ్ము మన ఋణము దీర్చుకొమ్మని పలికి వాని చెవిలో నక్షత్రేశ్వరా! నీవు నాశిష్యుడవై నందుకు భూపతికన్ని బాధలు పెట్టియైన దబ్బర లాడించితివేని దా నికే గురు కట్నముగా నెంచెదనన బాపండు వలెయని హరిశ్చంద్రుని వెంటనంటి జను చుండ గాధేయుండు సత్యకీర్తికి రాజ్యంబిచ్చి యదృశ్యాకారుడై నరనాథాదులు జను మార్గమధ్యంబున ముండ్లు గొప్ప రాళ్లుండు నట్లొనర్చుచు నీరు దొరికకుండజేయుచు నధిక బాధలం బెట్టుచుండ వారు గట్టిడుమ లనుభవింపుచు జంద్రమతి హరిశ్చంద్రు నవలోకించి ప్రాణేశ్వరా!

నవరోజు—ఆది తాళము.

నడువ జాల పుడమి పాల! ॥నడు॥
ఒడలు చెమటలెక్క దనువు స్రుక్క
నడుగులు దిడబడె నడుమనుసి యాడె ॥నడు॥
పొదిల నడును బోవుచుండ గట్టెన ఘుట్టమెల్ల జరిగె ముండ్లచేలె
పదములబొక్కులుదోచెనునాచం కదిగదు మనలోహితుండుకటకట

నావయి కరుణించి మెల్లమెల్లగ నడుపుడు పాలిత బాలాజీ కృప
యీ పగిదిని గలదాతపసికిమన మేమిజేసి నారమిట్టు లొనరించె॥

వ. చంద్రమతి కన్నీరునించి యిట్లనుచుండ హరిశ్చంద్రుండు గుమారు నెత్తుకొని భార్యచేయిబట్టి మెల్ల మెల్ల నడుచుచు మనమ్మున.

నాద నామక్రియ—త్రిపుట.

అక్కటా? యీ సతిపడు ప్రయాసమెట్టుల జూచియోపుదు॥నక్క॥
ఇక్కలికి మిన్న నానిమిత్త మీగతి నుండ వలసివచ్చె॥ నక్క॥
వాడె మోము దమ్మి క్రొమ్ముడి వీడె నడుగుదోయి క్రిందిపార
లూడె దీని నెమ్మెనికాంతి నూడె గంటిసీరు రయికపై నోడె॥నక్క॥
మేన జెమటలూరె బెదవులు మిగుల బీటవారె బాలా
జీనేలినహిమనగాత్మజా భోసిని నమ్మినందుకా యీగతి॥ యక్క॥

వ. ఈగతి జింతింపుచు భార్య నూరడింపుచు ధైర్యము జారనీయక జనుచున్నంత దొంగ బడలిక దెచ్చుకొని నక్షత్రకుండు నేలంబడి.

చ. అలసితినయ్య భూమిపయనానవు పాదములయ్య దప్పిచే
గళముఖమెండెనయ్య గురుఘర్మకణంబులు దోచెనయ్య శీ
తల సలిలంబొసంగినను దబ్బునసీడకు జేర్చి ప్రాణముల్
నిలుపకయున్న విప్రవటునింగడ తేర్చిన దోసమబ్బదే?

వ. ఇట్లన జంద్రమతి భర్తంగాంచి మన కుమారునైన విడిచి యీవటువును గాపాడుట యుచితంబన నరనాథుండా కలికి పలుకులకు మిగుల సంతసించి యొక కమలాకరంబును సమీపించి చల్లని నీటిచే వీరల దృష్టిజేసి తాను స్నానంబొనర్చి సంధ్యవార్చి కొంత జలము పుచ్చుకొని యడవుల దిరుగుచుండ నింత.

సీ. స్నాన సంధ్యావందనముల గావించు విప్రులవిచారమ్ములో ముంచు
నెద్ది। ఇలగల విప్రయోగుల కన్నుదోయికి పెనుభూతముగ గాను
పించు నెద్ది। ఆలస్యముగ పానశాల కేతెంచెడి జనుల చింతాబ్ధిలో
జొనుపు నెద్ది। యింటను జొరరాని యిందీవరాక్షుల పాలిటకుం
తమై బరగె నెద్ది.

గీ. అట్టి చలికాలమే తేర నవనిలోన
మానవులు జెప్పగల బుద్ధి మంతులగుట

గొన్ని సదుపాయముల జేసి కొనిరి గాని
తలప నల జంతువులకు నాధారమెవరు.

వ. ఇట్టి చలికాలమ్మున గట్టిడుమలనుభవింపుచు ముందు జనిచని యొక మఱ్ఱి చెట్టుక్రిందజేరి కసవు శయ్య గల్పించి నక్షత్రకుని దానిపై బరుండబెట్టి పైటకొంగుబరచి కుమారుండు జంద్రమతియు నిద్రింపు చుండ హరిశ్చంద్రుండు భార్య నవలోకించి కంట దడివెట్టి మనమ్మున.

సీ. చలువ తోటలలోన సంచరించెడి లేమ యడవి భూములయందు నడువవలసె। నెలరాలపై గదునింపుచుండు నెలంత కఱకు రానేల పై దిరుగవలసె। ఆరు చవుల తిండి నారగించెడిదాన దుంపలచే బొట్టనింప వలసె। మేడ మెట్టులనెక్కనోను సాధ్వీమణి యద్రుల గల్లాట మాడవలసె.
అకట పాపాల బడి యిట్టు లనుభవింపు
చున్న దీతలోదరి నన్ను గన్న తండ్రి
లోహితుండల బగిలలో షికారు
ఒనెశి వాసికి సిగతి సంభ వించె

వ. ఇట్లు వితర్కించు సమయమ్మున వేతాళుం డరుదెంచి పండ్లు గొఱుకుచు.

భైరవి—ఆది తాళము.

నరాధమా! యెవ్వడవురా యేలవచ్చితివిరా॥ నరి॥
నిరాన సింగము దరికేగిన కరి తెఱంగునవచ్చి నాచేతజిక్కితివి॥ న॥
బాలాజీదాసుని రక్షించిన పాలాక్షుడు నీకడ్డము వచ్చిన
వ్యాళముకప్పను మ్రింగి నగతినో పాలసా! నిన్నుబట్టి మ్రింగెదర॥

వ. ఇట్లు వేతాళుండన నరనాయకుండా లోకించి నీవు బ్రాణముల మీద నాశ యున్న వచ్చిన త్రోవబట్టి పొమ్ము లేదా యుద్ధమునకు రమ్మనగా వేతాళుండు గదియ నిరువురు ఘోర సమరము జేయ రాను రాను వేతాళునికి శక్తిదగ్గి శరణు జొచ్చిన రాజు కనికర హృదయుండై యింతిటినుంచి నాకింకరుడవై యుండుమని జెప్పి యచ్చోటు వాసి వచ్చుచు దారినడుమ నడ్డముదగిలిన కారుచిచ్చునుగడచి కాశీపురము సమీపించి గంగానదీ జలస్నాన మాచరించి విశ్వనాథాలయము జొచ్చి మనమ్మున.

సావేరి—ఆది.

శంభో! హర హర శంభో శివ శివ॥ శంభో॥
కుంభిదానవహరా దిగంబర జంభవైరిపూజిత చరణయుగళ॥శంభో॥
మేరుచాప చిత్స్వరూప ధవళాకార పాపహర భుజగకలాపా!
దిక్కు లేని వారలకును నీవేదిక్కని మదినమ్మి
మ్రొక్కితిమీ యనుగు దమ్ములకు మముబ్రోవగ నీకురమ్మి
పెక్కు కన్న దక్కువయ్యె నిక మాబ్రతుకు గనుగొమ్మి
అక్కటక్కటా యిట్టి యిడుమలెవరైన బడరు జుమ్మి
మక్కువ నామార్కండేయుకు మీ ప్రక్క జేరి కౌగలించి
వేడిన దక్కినప్పు సామిని శాసించిన దానవచయహారి
ణ మాగుత భూక్క పాల భగణ సూనిగణ పూ
జిత మృదుచరణ మాకుగల చిక్కు ద్రోసి కరుణ
నేలు బాలాజీ దాస శరణ భవతరణ॥ శంభో॥

వ. ఇట్లు శంకరుని ధ్యానించి యొకరమ్య ప్రదేశంబు జేరియుండ నక్షత్రకుండు రాజా! గడువు కాలము సమీపించినది యిదివర కొక పయిసాయైన్యలేదు నీయొద్ద ద్రవ్యమున్నట్టు కనుపడదు గావున మాయప్పు తీరుమార్గమూహింపుము లేదా యీయుజాల ననుము నేజనియెదనన భూపతి మారుబల్క లేక మోమువంచి కడగంటను భార్యముఖమాలోకింప నంత నక్షత్రకుండు రాజు నవలోకించి.

శ్లో. బూచివాని గతి నిటు నటు దిక్కులు జూచిన లాభంబేమి
దాచితివా ధనమప్పు దీర్పనా లోచింపుము భూస్వామి

వ. ఇట్లన భూపుండేమియు ననసేరక జూచుచున్నంత చంద్రమతి వల్లభు నవలోకించి.

నాదనామక్రియ—ఆది తాళము.

చింతింప నేలా? భూపాలా! బుధనుత శీలా! ॥చింతి॥
అంతటిదశ యింతకు వచ్చె నిక యెంతటి యవస్థ రానున్నదో మన
వంతుకు వచ్చినది యనుభవింపక పరులనుభవింతురే? ప్రియా!
పుడమిజేశులకు గీర్తియే ధనము విడువరాదు ధైర్యమెట్టియిడుములు
బడిన నూని ఋణముదీర్ప నన్నంగడిని బెట్టి విక్రయింపుము॥ చిం॥

అప్పుదీర్ప నింతకన్న వేరు వొప్పుగాన రాదీగతి జేసిన
తప్పక బాలాజినేలిన గౌరీ ధవునకు సంప్రీతి కాగలదు॥ చిం॥

వ. ఇవ్విధంబున బలుక త్రైశంకుండు కోటి మిన్నాపడంతి నమ్మి బ్రతికిన పాపాత్ముం డెచ్చోటనైనం గలడా యన జంద్రమతి భర్తనువిలోకించి.

ఆ డి—త్రిశగతి.

సందియ మొందనేలా యో నరపాలా॥ సంది॥
అందరి కిని సుఖ దుఃఖము లరయసమము జుమ్మీ॥ సంది॥
గజబిజ లెందుకు దోసము గలదెంకల్లకన్న
నిజముకన్న లేదిలపున్నెంబు రాచ మిన్న
అరలి స్థలో బోవు భార్య నమ్మిన దోసమ్మ
అనృత మాట దోసము బాయగ నేవరితరమ్మ
పాలిత బాలాప్తపై భారమూంచి నన్నమ్మి గుణ
జాలా! ముని యప్పుదీర్చి యశమును జేకొమ్మి॥ సంది॥

వ. ఇటులం బలుక హరిశ్చంద్రుండు వల్లెయని యీపల్లవోష్ఠిని యంగడికిందోకొని పోయి పౌరులారా! నాపేరు హరిశ్చంద్రుండు నేసూర్యవంశ సంజాతుండ త్రిశంకు నందనుండను నారాజ్యం బంతయు గాధేయునకు సమర్పించి మఖార్థమై వాగ్దానం బొనర్చిన విత్తమీయం జాలక నాభార్య నమ్మనీయకొంటి గావున.

సావేరి—ఆది తాళము.

మిగుల చౌక బేరమిదియు జంపు మెలతను గొన రండు॥ మి॥
మగువ త్రిశంకుని కోడలు దీనిప నిగనుగొన్న సంతసింత్రు పోడలు
నవ్వులాటకైన దప్పుగూయదు నాతిమిన్న చెరుపు పనులు జేయదు
బున్వబెట్టు వారిమాట ద్రోయదు పుణ్యకార్యములకు వెనుకదీయదు॥
పర పురుషులు దమ్ములని దలంచు పరులసొమ్ముదృణముగ భావించు
నిరుపేదల గన్న సత్కరించు నిరతము బాలాజిని స్మరియించు॥ మి॥

వ. ఇట్లమ్మ జూపినంత సూర్యుండు దన కొమరుండగు శనైశ్చరుని రావించి మన వంశ జాతుండగు హరిశ్చంద్రుని గాధేయుండు బలుచిక్కులు బెట్టుచున్నాడు గావున నీవేగి యాయిత్తమిచ్చి వాగల గౌశికుని స్వాధీనమునందప్పించి వారి యశము మల్లోకంబు

లవ్యాపించు నట్లాచరింపు మన కలిరాజు వల్లెయని వృద్ధబ్రాహ్మణ వేషమూని కాలకౌశికుండను నామంబున వచ్చి హరిశ్చంద్రు నవలోకించి.

ఝం ఝూటి — త్రిశ్రగతి.

ఎవడవురా నీవు యిందేల వచ్చినావు॥ యె॥
అవమానంబనక భార్య నమ్మ జూపెదవు॥
అలిని మర్యాద జేయక నమ్ముట తప్పు గాద
చాలు మాతిమీద మీసంబు నీకు లేద॥ యె॥
వినరా దోసకారి నీ వితర దేశము జేరి
వనభోణి దొంగిలించి నావని వింతి రోరి॥ యె॥
రాజభటులు విన్న నీ లావడంతురన్న గా
లాజీ వరదుని సాక్షి లలన విడువకున్న॥ యెవ॥

వ. ఇట్లు కాలకౌశికుండన నరనాథుండాతనిం గాంచి బ్రాహ్మణోత్తమా నీకీప్రసంగమేల కొనుటకు శక్తికలదేని మూడుభారముల ద్రవ్యంబిచ్చి మెలంతను గొనిపొమ్ము లేదా! వచ్చినత్రోవబట్టుమన నా కాలకౌశికుండు. మహాభాగముల్ విత్తంబొసంగి సతితిల కంబుసురమ్మన నవ్వేలది భర్తనవలోకించి నాథా! నేజనియెద బూర్ణానుగ్రహముంచుమని పదములకై నొరిగినంత రాజచూడామణి భార్యకెంతు చేతులుబట్టి కంటనీరునించి.

సీ. అర్ధాంగివైన నిన్నాదరింపగ లేక విక్రయంబున నేడు విడుచుచుంటి।
దాసీజనులవల్ల దగుసేవగొను నిన్ను బనికత్తెగా నేడు బాపుచుంటి।
ముగ్ధ మాటలనైన ముదమొంద గొనుచుసి చెంత నూరసహించు
వాత నుంటి। ఇంత కాలంబున కేకాంగినైయుండ వలసివచ్చె
నటంచు గలగుచుంటి.

గీ. పద్మభవు వ్రాతదాట నెవ్వరి తరమ్ము
చాన! లేలెమ్ము యజమాని శాసనమ్ము
పగిదినడిచి శీలమ్ముగాపాడు కొమ్ము
కంట దడి నమ్ము పారుని వెంట బొమ్ము.

వ. ఇట్లు నానరవిభుండన చంద్రమతి సుతుని వెంటబెట్టికొని జనుచుండ లోహితాస్యుండు తల్లిని విలోకించి.

నాటకురంజి—త్రిశ్రగతి.

అమ్మా! మా బాబేడే॥ యమ్మా॥
బొమ్మలను దెచ్చుటకు వెళ్లెనా॥ యమ్మా॥
ప్రీతిగల మాతలేరే పండు కోతి రీతినున్న తాత యెవ్వడే॥ య॥
నెటుగల గుఱ్ఱము లేవే యీ పేటకు మనకోట కెంతదూరము॥ య॥

వ. ఇట్లు కుమారుండడుగ జంద్రమతి కంటనీరునించి.

ఉ. మందను దప్పి గోవు పెనుమల్లడి నొంది యదృష్ట హీనతన్
బందెల దొడ్డికిం జనినభాతిని కౌశిక మౌని మాయచే
నిందలనుంటి నాడనకు డితడు ముద్దుకుమార నిమదిన్
గుందుట మాని నీదు జనకుం డరుదెంచును రేపు రేయికిన్.

వ. ఇట్లు కుమారునూడింపుచు పాయునిగ్రహముచేఁ నాకలవాకంటకి మగనిఁజుట్టు బట్టి నామీద దీనింగొని తెచ్చితివాయన చంద్రమతి యమ్మా! మగడు గ్రుడ్డివాడైనను ముసలివాడైనను భర్తనె దేవునిగా నెంచి సేవయొనరించి సద్గతినొందుట కులాంగనలకున్యాయ మట్టియెడ నీగతిపతిని బాధింతురా నేపనికైనా నరుదెంచితిగాని వేరొండు దలంపున లదన నాకునీతులు నేర్పుదానవాయని కొప్పుబట్టి భువిక్రిందుగనీడ్చి పదతాడనంబొనర్చి హింసవారియని పేరిడి.

సీ. ఇలు గుమ్మముల నూడ్చి కలియంపి వేజల్లి సొంపుగా ముగ్గుల నుంప
వలయు। అంట్లు చక్కగ దోమి యప్పుడంబులపిండి విసరి పెన్నిడ
కలు వెట్టవలయు। నిస్కరంటలుగుట్టి వేగ నంగడికేగి కూరలు గొని
తెచ్చి కోయవలయు। మాపటింటికైన తర్వాత నెంగిలి నెత్తి కసవు
శుభ్రముగ నిల్లు గడుగవలయు.

గీ. మిగిలినట్టి కూడిమ్మరు నొక్క వలయు
నంచబడి నంతె దివ్వెలు నెక్కవలయు
పగలు రాత్రులు నా కాళ్లు బట్టవలయు
పైట వాపమైన మంచి బంచ వలయు.

వ. ఇట్లాజ్ఞాపింప నల్లెయని కుమారుడుదాను పాయునింటగల పనులొనర్చుచు నని యించియుండ హరిశ్చంద్రుండు నలినమ్మిన విత్తంబు నక్షత్రకునికిచ్చి నమస్కరించి చను

మన రాజునా బాపండు దిలకించి మాగురువుగారిద్రవ్యమిచ్చితివి నానిమిత్తమేమియోచించితి వనవిని నక్షత్రకా మీగురువు ప్రయోజనముగురించి వచ్చితిరిగాని నన్నుద్ధరింపనరుదెంచలేదు గాన నింతిటితో దనివినొంది చనుండన నక్షత్రకుండురాజా !

తో. జనవర కారడవులలో వెనువెంటను దిరిగిన మాత్రమున
నను నీసేవ యొనర్చెడి భృత్యుఁడ ననుకుంటివే మనమున

వ. నీతాతగారి నవుకరుననుకొంటివా నీయబ్బగారినవుకరుననుకొంటివా కొంచ మాలోచింపుమన నయ్యా! తొలపరువ వచనములు పలికెదరు రెండురోజులలో మీకొసంగెదనన మంచిది యీవిత్తమేనాది గురువుగారి ఋణము దీర్పుమన హారిశ్చంద్రుండు.

నాదనామ క్రియ—త్రిపుట.

చంద్రశేఖరా! యీ బాపండిటుల జేసె॥ చం॥
చంద్రబీజ పర్వత నిలయా! సర్వవలయ వినిర్జిత ప్రళయ ! ॥చం॥
దిన ద్వయములో గాధేయుని ఋణముదీర్ప నేయుపాయము
గనుపించదు బాలాజీ హృద్వనజమిత్ర పార్వతీ కళత్రా ! ॥చం॥

వ. ఇట్లు వితర్కించుచున్న నరపాలునాలోకించి రాజా! చింతింపనేల పరమేశ్వరుని కృపనీయందున్నయెడ యీదురకస్థనికేల మాఋణము దీర్పుమార్గ మాలోచింపుము లేదా? లేదనిచెప్పుము చనియెదనన బ్రాహ్మణోత్తమా! మీఋణముదీర్ప సొమ్మించుకయుఁగానరాదు నన్నమ్మి మీయప్పుదీర్చుకొనుండన కల్లెయని యంగడికి హారిశ్చంద్రుని దోకొని చని బజారునడుమ నిలుకంబెట్టి నాగరులారా ! యీతండు త్రిశంకుపుత్రుండగు హారిశ్చంద్రుండు. విశ్వామిత్రఋణముదీర్ప నుపాయంబులేక విక్రయింపుమని నిర్ణయింప నీతని విక్రయింపబూనితి.

సీ. అలగాధి నందనుండడుగ నామానికి బుడమినంతయు ధారపోసినాడు
ప్రజలు సంపదలచే వర్ధిల్లుచుండు నల్లెడు దీవుల బ్రీతి నేలినాడు ।
గర్వంబుచే గారు కానలలో సంచరించు వేతాళు జయించినాడు ।
భరియింపరాని యాపదలంటుకున్న దబ్బరలాడనని బట్టుపట్టినాడు.

గీ. దినమణి కులమ్మునకు వన్నె దెచ్చినాడు
ఏకపత్నీ వ్రతాంబుధి నిదువాడు
కనుక మూడు భారమ్ముల ధనమొసంగి
వీని గొనిపొండు వేరండు విబుధులార !

వ. ఇట్లువిక్రయింపసమకట్టిన సూర్యనందనుండగు యముండు వీరబాహుండను నామంబున చండాలరూపంబున నరుదెంచి వీని నేనుకొనియెదనన రాజువిలోకించి చండాలా! నీవెక్కడ బాపండడిగిన విత్తమిచ్చుటెక్కడ నన్నెక్కడ కొనుటెక్కడ నీదురాలాపంబులు చాలింపుమన వీరబాహుండు రాజా! మాటిమాటికి చండాలా యనినిరసింపుచుంటివే.

తే. భూపా! మన యిరువురకు న్భేదము జూపు మధికద్రవ్యమ్ము
చేసిన దాసులుగలరు నాకు నీతోపనిలేదు నిజమ్ము.

వ. ఇట్లిత్థంబున బలికి బాపండడిగిన ద్రవ్యంబొసంగి రాజును వెంటదీసికొని చండాలవాటికకుం జని రాజా! నీకువీరదాసుండని నామంబిడితి.

సీ. మిగుల చౌకగవచ్చు మత్తని చర్మముల్గొని తెచ్చి చెప్పులు గుట్ట
వలయు । రాత్రి యామములందు రాజవీథుల జాగ్రత్తగ టమ్కట
మ్రోగొట్టవలయు । రేబవల్ పీనుగుల ప్రేతభూమికి దెచ్చువారిచ్చు సుం
కము ల్వట్టవలయు । గ్రామాంతమున నున్న గ్రామశూకరముల
బిలిచియాహారంబు బెట్టవలయు.

గీ. పాయగలు పందులను దెచ్చి మూయవలయు
రేయిని బరుండి నాకాళ్లు రాయవలయు
తోయముల నాకు నప్పుడు పోయవలయు
తీయ కల్లుసారాయి నాకీయవలయు.

వ. ఇత్తెరంగున నియమింప ప్రభుశాసన ప్రకారంబు పనులనొనర్చుచు నొకదినంబున వీరబాహునిపాదంబులు కట్టుచున్న సమయంబున వీరదాసా! నేనొనర్చిన కార్యంబుల జాగ్రతగా జేయసమర్థుడవని తోచినదిగాన నిదిగో ముద్రగుదియ యీనగరి వల్లకాటికింజని యచ్చటి పనులనొనర్పుమన భూపాలుండు వల్లెయని చని.

సీ. పాతిన పీనుగుల బైకీడ్చి భక్షించు నక్క దుమ్ముల గొంతు లొక్క
చోట । ఎత్తిపోసిన బుగ్గి క్రొత్తచేటలు జాపల్లోటు వోయిన కుండ
లొక్కచోట । సారాయి ద్రావి మాంసము మెక్కి యుట్టట్టు నూగు
చుండెడి శూద్రు లొక్కచోట । భూజమ్ము లెక్కి నిప్పులరాల్పి
యోహోహో హాహో యను పిశాచమ్ము లొక్కచోట

గీ. ఒత్తి పల్కు మాత్రక విప్రు లొక్కచోట
ఓమటెని మెక్కు సెరుకాకు లొక్కచోట
ఓలిగా గాలు పీనుంగు లొక్కచోట
అట్టి వల్లకాడు త్రిశంకు పట్టి చూచి.

వ. ఇట్టి ప్రేతనికేతంబునకు నేలిక నై యుండవలసివచ్చెనని లోజింతించి యచటి పనులు స్వైరవేర్పుచుండ గాలకౌశికుండు లోహితాస్యుని దిలకించి.

సావేరి—ఆది తాళము.

విను మోరి బాలకా! నీవు లోగ్గి శ్రద్ధతో॥ విను॥
తినుబడి వస్తువుల బొట్టనింపగ దిని తిరుగుచుంటివిగద వృధా॥ వి॥
అటవిసీమలకు నేటినుంచి యీ వటులతో జనుదెంచి ఫలపత్ర
పుటముల గొని తెమ్ము లేనిచో నిన్నటుకటుగావింతు బాలాజీసాక్షిగ॥

వ. కాలకౌశికుం డీరీతినిబలుక లోహితుండు గనుదమ్ముల నశ్రుబిందువులు జలజల రాల్పుచు దల్లితో దెలుప గుమారుని చంద్రమతి.

కాఫీ— ఆది తాళము.

తనయా! తనయా! నిన్నిటు బనిచెదర సవినయా॥ తన॥
కనికరమువాని బ్రాహ్మణుండు నినుగానన భూమికి బంపదలచెనా?
అనయముసిరి తోదులదూగుచుండు యతివలకు బుట్టక విపత్తుల
మునుగుచున్న నాకడుపున జనించి పెనుబాములనుభవింపవలసెనా?
తారు కానలకు బొమ్మనుటకు నానోరెట్లు లాడురా
పారుని శాసనంబు మీరితిన భూపద్రోహము బ్బురా కాన
మారు బల్కరాదు చేయుట మంచి సీమసాదు
పూర్వపుణ్య మెట్టులున్నదో యీ తీరున బాలాజిదయ రాక పోదు॥

వ. ఇట్లు చింతించి సకలదేవతా ప్రార్థనంబు గావించి కుమారుని దీవించిపంప లోహితుండు తోడిబాలురంగూడి యడవికేగి సమీపమందున్న మఱ్ఱిచెట్టు క్రిందంగల పుట్టపై నొకపాదము రెండవపాదము ప్రానితైయుంచి పండెడియాకులంగోయ.

క. ఆ తఱి సహిరాజంబల
భూతల పతిసుతుని పాదమున గరువగ లా

5 ఖలుదైవమునన్నాప । దలముంచెనని పలుమాఱు
బలవింపనాతోఁగూడ విలపించువారెవరోకొడుకా! ॥మొ॥
6 పరిపాలితబాలాజి । కరుణనీగతిమనపై
నెరపినందుననిట్టి । నెవ్వలబ్బినవికొడుకా! ॥మొ॥

వ. ఈగతి నేడ్చుచు లేచి యేలికసాని ననలోకించి యమ్మా! నాకుమారునకు పాములవలన నడవిలో చావు తటస్థించెనట కరుణించి సెలవిచ్చిన నాకలహకంటకి యేమే మీపాములవలన నీబిడ్డండీలైనా మాకుసంతసమే యేలయన యింటంగల వస్తువులం దిని క్రొవ్వుబట్టి మత్తిక్రిందపుంజులనేతోడిబాలుర వెంటనంటి వెళ్ళిన వీనికేల మరణము తటస్థించును? అనిపలుక నమ్మా యట్లనవలదు కరుణించి సెలవొసంగుమన మంచిది యింటంగల పనులందీర్చి యవకాశమున్న నేగవచ్చునన పగలంతయుంగల పనులనెరవేర్చి కలహకంటకి పాదంబులంబట్టి యామె నిద్రం జొక్కినపిదప బైలువెడలి పతిభక్తియే నూతగాఁజేసికొని మధ్యరాత్రియందడవిఁజొచ్చి పుత్రునకై వెతికి యొకచోట నేలంబడి యున్న వానింగని లేపి లేవకున్నంత వక్షస్థానంబున గరతాడనంబొనర్చుచు.

ముఖారి—ఆదితాళము.

లేవవేమిరా తనయా !॥ లేవ॥
యేవిధముననిందు । జీవించియుందుముందు॥ లేవ॥
చెల్లబోనేడునీతండ్రి । యుల్లమేరీతిదల్లి।
ఝల్లుమన్న దోదెలియ । దల్లననాముద్దుకొడుకా! ॥ లేవ॥
అలనాడునీచేతికి । ఖ్యాధారమనియుంటి
గలనైననిట్టిపని । కాదనుకుంటి కొడుకా॥ లేవ॥
కన్నతండ్రి! పాలితబాలాజీ । కెన్నడెగ్గుఁజేసితి వ్రాయా
పన్నగమును నీకొఱకై గ। ల్పనజేసెనన్నా ! రాచ
మిన్నా! నన్నుగన్నతండ్రి! క్రన్ననబలుకకున్న బ్రతుకుటన్నా॥ లే॥

వ. ఇట్లేడ్చుచు నుచితసంస్కారము చేయందలంచి మూపున బిడ్డనెత్తుకొని స్మశానవాటికం బ్రవేశించి యొండుకట్టెలంజేర్చి చితిపేర్చి దానిపైగుమారునిడి.

ఉ॥ ఓరికుమార సిన్నసిసి యుయ్యెల తొట్టినిబెట్టి దాదులిం
పారగ సౌధమధ్యమున బాటలపాడగబాడి యూపగా
గూరుకుఁజెందుసిప్పుడు ఘోరమ్మశానవశులున్న చోటికిన్

చేరగవచ్చి పెంజిలువచే గతజీవుడవై తివింక యే
తీరుననుందు నిన్వీడిచి తీరనిదుఃఖము పెట్టిపోతివా.

వ. ఇట్లు చింతించి యగ్నిసంస్కారము సేయందలంచి ప్రదక్షిణమొనర్చి చేతు లాడక.

హిం॥ భయిరవి—రూపకము.

నీకునాకుగలఋణమ్ము। నేటితోదీరెనా కొడుకా! ॥నీకు॥
భీకరాహిబుసకొట్టుచు। నీ కాల్గఁ జువఁగనపుడు
నాకొడుకాయెంతతల్లడిల్లినావో యిటురావో॥ నీకు॥
మగనిబాసినిన్నుజూచి। మదిలోపలబాదుకొన్న
దిగులుమానిధైర్యమ్మున। దిరుగుచుంటికొడుకా!
పగవహించిబాలాక్షి। వరదుండునాకుత్తుక
తెగనీక త్రిత్తోడగోసె। తగుదయనాపైనిడక
సుగుణగణా! నాకుంగల। వగపుమాన్పువారేరీ
జగతినినాకేమియుదో। చదు చూపుమేదియొదారి॥నీ॥

వ. ఇత్తెరంగున బలవింపుచుండ హరిశ్చంద్రుండాలకించి వచ్చి నీవీవడురేయి నిచ్చటికేలవచ్చితివి మరణమొందినవాడు నీకేమికావలయు నేకారణమున నీతండంత యొందెనో చెప్పుమన నావెలంది.

ఆనందభయిరవి—చతురశ్రగతి.

ఓపావనచరిత్రా! యఘులతాలవిత్రా!॥యో॥
బాపనయ్యయింటగల్గినట్టి। పనులొనర్చికాలముగడుపుచుంటి॥ నో॥
నన్నుహంసనారియనుచుబిలుతురు। నాయేలికఫలములదెమ్మనగా
క్రన్ననానాకొమరుండడవికిజని। కొన్నిపండ్లుగోయుచుండనత్తరి
పన్నగంబువీనినిగఱువగత। ప్రాణుడయ్యె నల్పజీవిదల్ప వీనిగాల్ప
సెలవొసంగు॥ మో॥

వ. ఇట్లు విన్నవింప నాతండాలోకించి నాయాజ్ఞలేనిది ప్రేతభూమికి వచ్చినందుకు నాడుదానవగుట సహించితిని యిదియే నాగనాడయినచో నీకరవాలమ్మున నానితల గుండ్యలు సేయక మాన నాపేరు వీరదాసుండు వీరబాహుండగు నాయజమానుని శాసనం

బదులంబించి యిచ్చుటనుంటి సొదపేర్చినంత-చోటుకొక మాడసమర్పింపవలయు. నీవంగీకరించితివేని మాడయిచ్చి చిన్నవానికి నగ్నిసంస్కారమొనర్పుము లేదా ! వచ్చినమార్గము పట్టుమన మహాత్మా !

తో. ఇడుములనేకముబడుచుంటిని నాకీగతి వ్రాసెనుధాత
కడుబిదరాలనెట్లీయంగల కాసైనలేదుచేత
కరుణింపుము చెదరిపడియున్న యీకట్టెలెల్ల బేర్చుటకు
వెరవుమాన్పి సెలవొసంగుమిపుడీ పీనుంగునుగాల్చుటకు.

వ. ఇట్లు ప్రార్థింప చిన్నదానా ! మాప్రభుశాసనప్రకారము చేయక వీలుపడదని నొక్కి వక్కాణించినను కొంచమయిన నాలోచింపకుంటివి. విధాయకముగా మాకు మాడ సమర్పింపక తప్పదని పతినిజూచి కన్నీరునించుచు.

సీ. సకలభూపాలక మకుటోరునవరత్న కాంతిశుంభత్పాద కమలు డె
వడు । గాధేయుకరుణస్వర్గముగొన్నయల త్రిశంకునికూర్మి పెంపుపు
కొమరుడెవడు । పిల్లలగాపాడు తల్లిదండ్రులరీతి ప్రజలహర్షముగ
గాపాడెనెవడు । అమృతమాడగలేక నప్పుదీర్చుటకునై యాలినంగ
డిబెట్టి యమ్మెనెవడు ।

గీ. విష్ణుచంద్రుల కావిర్భవించెనెవడు
అట్టివరహరిశ్చంద్రుని యనుగుపట్టి
కఠినమైనట్టి యీగావల్లకాటిలోన
తోలబెట్టుటకైనను తగడటయ్య ?.

వ. ఇట్లన వీరదాసుండు యేమేమీ చక్రవర్తి గార్యనంటివి యొకకాసైనను లేకపోయినదా ! యన చంద్రమతి మహాత్మా ! యున్నయెడ యీబాధయెందుకు నాయందనుగ్రహింపుమన, చిన్నదానా ! కరుణింపుము కరుణింపుమని పలుమారు పల్కుచుంటివి.

ఉ. పంచశరారిపూజ నెడబాసియక్రోధనమెల్ల నబ్ధిలో
ముంచికులాభిమానమొక మూలను జేర్చి యదృష్టహీనతన్
బంచమవంశజాతునకు నౌకరునై యిటరుద్రభూమికే
తెంచినక్రూరచిత్తుడనుసతీ ! దయజూపగలండెచెప్పుమా ?.

వ. పోనిమ్ము కార్యమైనలేదంటివి నేఁజెప్పినచొప్పునఁజేయుము.

తో. జలజపత్రనేత్రా ! మాకీయఁగవలసిన మాడకుబదులు
గళమునఁగలశీతమానమిచ్చి సంస్కారంబొనరిచి కదులు

వ. ఇట్లన శీతమానమిమ్మని యడుగుచున్నాఁడు నామంగళసూత్రము నాపెనిమిటికిఁ దప్ప పెరవారికిఁ గానరాదుగనుక వితండు నాపతియే సందేహములేదని హరిశ్చంద్రు నవలోకించి.

క. జనవరమును మీఁగ్రోలమీ
దనునిద్దురబోయినట్టి ధరణీస్థలిపై
తనయుఁడువడి పెనునిద్దుర
గొనియున్నాఁడిదిగో మాడుకుమతవిదారీ.

వ. ఇట్లు చంద్రమతిపలుక హరిశ్చంద్రుడు దుఃఖమాపలేక.

రాగ॥ భైరవి—ఆది.

ననుజూచుకన్ను దెఱచి నాముద్దులకుమారా ? ॥నను॥
పనిమీఁద నేయిట జనిమరలవచ్చుచున్న
ననుజూచి తాతావచ్చినాఁ డనియెదురువచ్చువారెవరో
నకరములమీఁద పుణ్యలోకమునకంపెదవని మా
రాకారనమ్మియుండ కాలాంతకుండని సత్కృప
లేకయేకదా ? నిన్ను నాకరముల మీఁదబుణ్య
లోకమునకంపవలసివచ్చెను నాకుమారా ! సుకుమార ॥నను॥

వ. ఇట్లు బలవించు నరవిభు నాసతీమతల్లి చూచి జీవితేశా !

క. మనమీఁగితి దుఃఖాబ్ధిని
మునిగిన లాభమ్ము లేదు ముందుపనులుయో
చనజేయుఁడీ నుడుదోపక
మునుకే యేలిక నికార్యముసేగినవాకెన్.

వ. ఇట్లన హరిశ్చంద్రుండు యువతీలలామా ! యిచ్చట నెవ్వరుండిరి చేయఁగలసిన కార్యము గావింప బాగనుండునని నీతలంపుదేవునకు దాచఁగలమా ! గావున.

తే. తడయక జని నీయేలిక బాపని। నడిగిమాడమాకిమ్ము
బుడుతనుతదుపరిగాల్పవచ్చునో పూర్ణేందువదన ! లెమ్ము.

వ. ఇట్లన జంద్రమతి ప్రాణేశా ! చిన్నవానిని జాగ్రతగాచూడుము చని వచ్చెద నని పొరుగింటికి బోవుచున్నతరి గాధేయుచే నంపబడిన దొంగయొకడు కాశీరాజ పుత్రునిజంపి యానగలన్నియు దెచ్చి చంద్రమతికిచ్చి పిమ్మట రాజభటులతో కలిసివచ్చి వారలకీవనజాక్షి నప్పగించ తద్భటు లీమెను కాశీరాజుముందర నిలుపగా దీనిముఖము చూడకూడదు. వీరబాహునియొద్దకు దోకొనిపోయి తలతెగగలసినదని యాజ్ఞ నేనిచ్చితి జనుడని రాజువల్క నంతవారామెను వీరబాహునియెదుట నిలుప వారెందు నానొకరు వీర బాహుండు వల్లకాటిలో కావలియున్నాడు వానియొద్దకు పొండన మంచిదియని చంద్ర మతిని రుద్రభూమికి గొనితెచ్చి హరిశ్చంద్రునియెదుట నిలుప నాతండు విస్మయమంది యేమిచిత్రము రణభూమిని నోటగడ్డి గఱచివచ్చువారల నిరాయుధుల శరణముగోరు వారల రక్షించునేను నిష్కారణ మీయాడుదాని జంపవలసివచ్చినది చంపితినా స్త్రీహ త్యవచ్చును మానితినా రాజద్రోహమబ్బునని డోలాయమానసుండై చింతించు సమయం బున నాసాధ్వీలలామ పక్కున నవ్వి భర్తనవలోకించి.

సావేరి—ఆదితాళము.

అనుమానింపగనేలా యవనిపరిపాల॥ యను॥
వినుమీయేలిక చెప్పినగతిగా పింపబూనుకొమ్ము లేలెమ్ము॥ అను॥
రాచపట్టినిజంపినగలెల్లదోచుకొంటినను చుదుర్మార్గులు
నీచాపనిందనాపైనొక్కటి నిల్పినారుగాన వేరేయా
లోచింపగనేలా ? బాలాజీ లోపమెన్న నిఘాలాత్ముడేగతి
నీచేతికత్తిచేనను ద్రుంపుమ రవివంశాబ్ధిచంద్ర! నరేంద్రా ! ॥అను॥

వ. ఇట్లాపడంతి పలుక నరేంద్రుడామెధైర్యమ్మున కచ్చెరువొంది మంచిదియని నరుకబోవ నాసమయమ్మున విశ్వామిత్రుం డరుదెంచి కరవాలమ్ము బట్టుకొని భూపాలు నివారించి.

కమాచి—ఆదితాళము.

ఓరాజా ! తగునాసతిని జంపబూనుట॥ ఓ॥
నీరదనిభత్యాగీగజరజనీచరసూదనపదానురాగి॥ ఓ॥
రక్కసుడవుగాక అహా రాజునెమలిలేక వశిష్ఠుడు

చక్కెరబోడుల జంపమను చదువు మక్కువతో జెప్పెన
మనమెప్పెన॥ యో॥
అరిభూపాలసమాజోన్నతమద మణంపగలశక్తిగలసి
కరవాలమున గులాంగనకుత్తుక ఖండింపగనాసక్తి ధరణీ
వర! దృఢముగబుట్టినపిచ్చి పట్టిన నీనీతిగిట్టెన॥ యో॥
అమలంబయినట్టి సూర్యకులమున బుట్టినీ
యనుంగుపడతిని సమయింపగసమకట్టితివా? నీని
మమునుదిగనాడినాకూతులకా స్త్రములువట్టినట్టయినకీర్తి
కొమరుడుజీవించుమరినీ కోమలియే లభించు నీరా
జ్యము క్రమ్మఱవచ్చు బీబాలాజీవరదుడుమెచ్చు॥ నో రాజా॥
వ. ఇట్లు విశ్వామిత్రుండన హరిశ్చంద్రుండు మునికులోత్తమా!

తోడి—ఆదితాళము.

వినుమయ్యనామనవి నీనుంగవనొడ్డి॥ విను॥
మునుమీరునాతో జెప్పిన బుద్ధులుగావె క్రొత్తలుగలవె॥ విను॥
పరులగెలినినన్నెంచక నాకర వాలమ్ము విడిచి యింటికి సత్వర
నరుగుమింక బీబాలాజీదా సావనుండుమిమ్ముగాపాడునేడు॥ విను॥

వ. ఇట్లనే విశ్వామిత్రుండు నిర్గుణజనియె పన్నుట హరిశ్చంద్రుండు రెండవపర్యాయము నరికిన నాకరవాలమ్ము పూవుదండ లెరంగునబుట్టికొనిన నేల మగండాశ్చర్యమంది మూడవపర్యాయము పరిశోధించెదనని నాభ ర్యపతివ్రతయయ్యేనేని యిప్పుడీ కుతుక తెగునుగాకయని కత్తియెత్తినంత జంద్రమతి సూర్యునిపై జూడ్కి నిల్పి హస్తములు శోధించి.

సీ. నన్ను బుట్టించితే నరజన్మమేనాకు గరుణింపుమయ్య యోకర్మసాక్షి
అందుసద్గుణవంతు రాలుగాచక్కని కాంతగానుంపుమో కర్మసాక్షి
సత్యాత్ముడగుహరిశ్చంద్రునినాభర్తగా జేయుమయ్య యోకర్మసాక్షి
ఆజ్ఞదప్పనిలోహితాస్యుండుసూనుండుగానుంపుమయ్య యోకర్మసాక్షి
పేదసాదలప్రీతి నాదరించుటకునై కనకంబొసంగుమో కర్మసాక్షి
సంగీతసకలభాషాసాహిత్యపరిజ్ఞానంబొసంగుమో కర్మసాక్షి

ఆర్యానుకూలవేదాంతవిద్యాసక్తి గరుణింపుమయ్యయో కర్మసాక్షి
అంత్యకాలమువచ్చి నప్డు ముత్తైదువగా దర్శ జేయుమో కర్మసాక్షి
గీ. నిర్మలకరప్రదీపయో కర్మసాక్షి
గ్రహపతీ! లోకబాంధవా! కర్మసాక్షి
కమలచక్రసమూహాప్త కర్మసాక్షి
కర్ణజాభవ హారిరూపకర్మసాక్షి॥

వ. అని యిత్తెరంగున బ్రార్థింపుచున్న సమయమ్మున.

హిం। భయిరవి—ఖండగతి.

అంతనాగీర్వాణులంతరిక్షమ్మున నెంతయోచింతగొని వింతగను చుండన్ । జెంతగలభూతములు గొంతుకలబంటి నల్లంతగొన నూకలిడి గంతులిడుచుండెన్.

మిశ్రగతి.

తలమీదనల నెల వంకతో నొక కేల ముద్దులజింకతో
జడలందుగల మిన్నేటితో కొనవంగుచిటికెనగోటితో
గననింపుగల మింజడలతో విభూతిబూసినయొడలతో
వెనునంటు యేనుగుతోలుతో నొక కేలము మ్మొనవాలుతో
మెడనున్న పుసుకల దండతో నొక చేతబంగరుకొండతో
కడునల్ల కుత్తుక సొంపుతో నెమ్మేన పాముల గుంపుతో
తొడమీద విద్దెల ప్రోడతో మునుమున్ను తెల్లనిదూడతో
దయగల్గు చల్లనిచూపుతో వెనుమంచుగుబ్బలిపాపతో
మహానటుం డరుదెంచె నామానవతిని గావన్॥

వ. అంత నాయాలిమగలాదేవుని విలోకించి.

ఆనందభైరవి త్రిశ్రగతి.

పరమేశ్వరీశస్వరూపా। పముగని ధన్యులమైతిమి
కటాపుడీరె నింకదయా। కరగజదానవహారా? ॥ప॥
దేవతలయినను నీమాయ। దెలియలేరు మృగధరా

మూఁవశమా గనుంగొనను । మామనోబ్జబంభరా॥ ప॥
పాలిత బాలాజిదాస । భక్తజనాధినిరాస
పాలాక్షవ్యోమకేశ । పాపతిమిరదినేశా॥ ప॥

వ. ఇట్లు నుతిజేయ మహాదేవుండా హరిశ్చంద్రుని మేను నిమిరి రాజా? నీసత్యమ్మునకు మిగుల సంతసించి నాడ నీకీకష్టములు ముట్టడించెనని వగవకుమని బుజ్జగించి.

సావేరి—ఆదితాళము.

రాజా! దీనమానవకల్పభూజరూప వినిర్జితరతి॥ రాజ॥
రాజరాజశేఖర శ్రీబాలాజీవరదపాదానుమోద॥ రాజ॥
తనువున జర్మము వేసి పె। న్నెడల విభూతినిబూసి
బహుగుదయ్యములు గొలువగయా। వల్ల కాటికిం బ్రభుడవైతివో
ప్రథమిత్రేడనాతో సమానుడవైన నీ
సతత మితరభూపతులకు సరయగలేవు సుగుణములకుస్థానమీవు॥
చూడు, నీభార్య కెలిన। వాడు, కలిరాజు బాపడు
గాడు, నీయొడయడగుమాల। వాడు, సమవర్తియిదివల్ల
కాడుగాదు జన్నములొనరించెడి। వాడు సందియంబేల గనుగొనుము
నేడుభూమిలో నీకుసమానుడు। లేడు మదినిగలగోడుదిగనాడు॥ రాజ॥

వ. ఇత్తెరంగున బల్కి హరిశ్చంద్రుని కన్నులకందుదున నాతండంతయుజూచి స్మయనంది.

క. జలజారిమౌళి! నీమహి
మలు బలరిపు పద్మభవ రమాపతులైనన్
దెలియగ లేరను వాడుక
కలదిక మాబోంట్లకెల్ల గనుగొనవశమే.

వ. అంత చంద్రమతిని పార్వతీదేవి గాంచి యమ్మా నీపతివ్రతా ధర్మమున కెంతయు నానందించితి నీయభీష్టం బెఱింగింపుమన నా చంద్రమతి అమ్మా కాత్యాయనీ! కాశీరాజ సూనుని జంపినానను నింద నొందియుంటి నాచిన్నవానిని సజీవునిగాజేసి నాకుంగల యపనిందబాపుమని ప్రార్థింప సాధ్వీలలామా! నీకీచింతయేల యిదివరకే బ్రతికించితి సంశయ మొందకుమను సమయమ్మున లోహితాస్యుండు లేచి నిలువంబడ

నాకుగుణవతి కడకేనియానందమున గొమరు నెత్తుకొని ముద్దిడుచున్నంత విశ్వామిత్రుం డరుదెంచి యోహరిశ్చంద్ర నరేంద్రా! నీయెడల జాల నపరాధినైతి క్షమింపుము మఱల నీరాజ్యమును గైకొనుమన రాజు తపోధనా! మీకృపారసమువలన నాయశంబు లోకమున వ్యాపించుటచే నాకు మేలుగావించిన వారలలో నొకనిగా నెంచితి రాజ్యము నాకవసరములేదు మీరే యనుభవింపుఁడు లేనిచో మీయిష్టమువచ్చినవారిచేఁ బరిపాలింప జేయుఁడని బల్క గాధేయుండు రాజా! నాకు నిష్టముగల రాజువు నీవే పాలించెదవా యనృతమాడెదవా? యని బల్కు సమయమ్మున వశిష్ఠుం డరుదెంచి యోహరిశ్చంద్రా! నాశిష్యుడవైనందుకు నామర్యాద నిలిపితివి పాపమితండు క్రమ్మఱ రాజ్యభారము వహింపుమని గోరుచున్నాడు గనుక నాపాటిమాటయైన జెల్లింపకున్న సరసముగా నుండదు గావున గౌశికుని కోరికదీర్పుమన హరిశ్చంద్రుండు వల్లెయని మఱల రాజ్యముం బాలింప నుద్యుక్తుండైనంత నచ్చట పట్టాభిషేకంబొనరించిరి పిమ్మట నారదుం డయోధ్యకరుదెంచి హరిశ్చంద్రుండు వచ్చుచున్నాడని సత్యకీర్తితో విన్నవింప నాసత్యకీర్తి యత్యంతానందమ్మున కౌశికునాజ్ఞచే పట్టణం బలంకరించి యెదురుగవచ్చి హరిశ్చంద్రుని దోకొనిచని పట్టాభిషేకం బొనరించిరి. తదనంతరము సతీసుత సమన్వితుండయి యనుకాలమ్మున రాజ్యంబేలి యంత్యమున సద్గతినొందె. నిట్టి హరిశ్చంద్ర చరిత్ర వినువార లనృతవాదులుగాకుండ నందు నటుల బ్రయత్నించి తత్ఫలమనుభవింతురుగాక.

త్రైశంకువిజయము సమాప్తము.

---

సురట—ఆదితాళము.

మంగళం మహాదేవ మంగళం జయ॥ మం॥
అంగజగర్వ విభంగసాగర నిషంగ నగజాతముఖరాజీవ ప
తంగదళిత మాతంగదనుజధవళాంగ వృషతురంగ దయాంతరంగ॥
బాలచంద్రశేఖర రణభీకర । నీలకంఠ ఘోర మరితాభ్రభవా
శూలకరధృతకపాల శూలకరు । కాలవాల బాలాజీప్రపాల॥ మం॥

---



# హరిశ్చంద్రుని జన్మవృత్తాంతము.

వ. దక్షప్రజాపతి భార్యయగు సుకరిణియందు దిరువదేడ్వురు కుమార్తెలు పుట్టిరి వారలకు క్రమమున అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి యను మొదలగు నామంబు లుంచి గారాబమున బెంచి సకల విద్యాధికులంజేసి పెండ్లిజేయనూహించి చంద్రుండు దన బిడ్డలకు దగినవాడని నిశ్చయించినంత సోహాళుతులు తండ్రికిమ్రొక్కి నాన్నా! మా యక్క చెల్లెండ్రనందరిని చంద్రునకు గట్టిపెట్ట నూహించినట్లు వింటిమి అయితే మాలో రోహిణివిద్యయందు చక్కదనమున తెలివితేటలో మాకన్న వేయిరెట్లెచ్చుగనుక నామె యందనురాగమున మమ్ముల ననాదరించునను భీతి స్వాంతముల నల్లుకొనియున్నదిగనుక నిట్టిసంగతిలో కొంచెమాలోచించి పెండ్లిగావించుట మాయభిమతంబని నామాట తండ్రి విని చంద్రునిరావించి తనకుమార్తెల యుద్దేశమెఱింగించి యందరియందేక స్వభావ ముతో వర్తించునట్లు కట్టుదిట్టముచేయించుకొని బిడ్డలను చంద్రునకిచ్చి పెండ్లిగావించె నంత నాచంద్రుండు భార్యల వెంటనిడికొని యిల్లుచేరి సుఖింపుచు రోహిణియందుగల ప్రేమాతిశయమున దక్కినవారల ననాదరింప నాగరితలు తండ్రిమ్రోలకుజని భర్తవలన వారలకుంగలిగిన యవమానమును వెల్లడింప దక్షుండు కోపించి కళానిధి కళాహీనుండగు గాకయని శపియించె నాసంగతి రోహిణివిని దిగులున దండ్రిని బ్రార్థించి నాన్నా! మీ తో నాఅక్క చెల్లెండ్రు చెప్పినమాత్రంబున కోపించి నాభర్తను శపియించుట ధర్మము గాదు కరుణింపుమని పదములమీదబడ దక్షుండు గనికరహృదయుండై చంద్రునిరావించి నీవు నామాటమీరి నడిచినందున నీకటుల శపియించితినని యనుచుండగా చంద్రుండు దక్ష ప్రజాపతినిచూచి మహాత్మా నావలన నీలోపము జరిగినమాట సత్యమిది మొదటి తప్పగా నెంచి క్షమింపు డింతటినుంచి యందరి నేకరీతిగ జూడకున్న మీచిత్తానుసారి జరుప వచ్చునన దక్షుండు కొన్నిదినములు సురూపముగానున్నను కొన్నిదినములు కురూపముగా నుందువు గాకయని చంద్రునకుంగలశాపము మరలించె. అంతనంత ౦ డింపముఖులతో బోవుచు గౌతమాశ్రమమునందలి యొకసరస్సునుజూచి అందు భార్యలతోగూడ జలక మాడి నిజనివాసంబుజేరె. నింత గౌతముండాకొలను సమీపించి అందుగల జలంబు ఖిలం బగుటజూచి కోపంబున నింతటినుంచి యీసరస్సున నాడువారు మునింగిన మగవారును మగవారు మునింగిన నాడువారగుదురుగాకయని శపియించి చనియె. నిట్లుండ నొకదినం బున నగల నాకొలనిలో స్నానమాడవలంచి చంద్రుండు భార్యలతోనరుదెంచి మొదట

తానదిగ స్త్రీరూపుండయి కొంతవడిచింతించి విష్ణువును ప్రార్థింప నతండరుదెంచి స్త్రీరూపముతోనున్న చందురుని మోహించి వ్యవహరించినంత కుమరుండొదవె పిమ్మట వాహరి గౌతమునివలన సరస్సునకుం గలిగిన శాపమును జెప్పి నీవిప్పుడు స్త్రీరూపమున నుంటివి సరస నిందు దిగితివేని మగవాడవగుటకు సందియములేదని జెప్పగా చంద్రుండు సరస నాసరస్సునదిగి యెప్పటివలె మగరూపమును వహించి కన్నకొమరు నచట విడిచి భార్యలతోగూడ నింటికిజనియె శ్రీహరియు వైకుంఠమలంకరించె నంత నా కోనేటి గట్టునబడియున్న చిన్నవాని రోదనము గౌతముండువిని వచ్చి బిడ్డనుజూచి మెచ్చి దివ్యదృష్టిచే బాలకుని జన్మస్థితి తెలిసికొని అహల్యను రావించి బాలకుని జన్మకథనం జెరిగించి హరిశ్చంద్రుండను పేరిడి పెంచుమన నాతిశువ్వీని గారాబమున బుత్రకుని పెంచుచుండె నంత నొకదివసంబున త్రిశంకుండు సంతానములేక పరితపించి గౌతమునితో తన కుంగల లోప మెరింగింప నతండే చిన్నవానినొసంగి వృత్తాంతమంతయు జెల్లడింప త్రిశంకుండత్యంతానందంబున బాలకుని దోకొనిపోయి గారాబమున బెంచి తనరాజ్యమునకు ప్రభువుగా నియమించెను.

హరిశ్చంద్ర జన్మకథ ముగిసెను.

శ్రీ

# చంద్రమతీదేవి జన్మవృత్తాంతము.

తన మాంగళ్యసూత్రము పెనిమిటికి తప్ప పరులకు గానరాని కారణము.

వ. అవంతిపురంబున పురందరుడనువానికి నేడ్గురుతనయులు నొకపుత్రికయు గల దందు కనిష్ఠునకు అష్టవక్రుడను పేరు వానికి నంబుజాక్షియను నామాంకితముగల యొక చక్కనిగబోడిని పెండ్లిచేయ నామె పెనిమిటి కురూపుండగుట వాని నిరసించి చిత్రకేతుండను రాజుతో గూఢముగ వ్యవహరింపుచుండ నీచర్యల త్తమామ లాలోకించి యంబుజాక్షి నొకయింటనునిచి తాళము వేయ నీసంగతి చిత్రకేతుండు దెలిసికొని భటులనంప వారలేతెంచి యష్టవక్రుని తల్లిదండ్రులం జంప తక్కినవారలా దేశంబువిడిచి పారిపోయిరి. తాళముపీడ గొట్టి యంబుజాక్షిని దోకొని రాజునకు సమర్పింప నామె శరీరసౌఖ్యము నా చిత్రకేతువలన దీర్చుకొనుచు మితిలేని పుణ్యకార్యము లొనర్చుచు కొన్ని దినముల కాతనువువిడిచి గొప్పకిరాతియై జనించి దారువనదుమనుండ నొకకిరాతుండా కీటకమును జంపె నంత మూడవజన్మంబున కంపిల్యపట్టణంబేలు జయసేన శుకవాణులకు గుమారితయై జనింప సిద్ధాంతులు చంద్రమతియను పేరిడి యీచిన్నదియమంగళవతిగానుండు నని జెప్పిరి. పిమ్మట చంద్రమతి పండ్రెండేండ్లు ప్రాయమువచ్చి రజస్వలకాగా నానక్షత్రము దైవజ్ఞులుచూచి యీచిన్నది మీరాజ్యమందుండెనేని నీవు రాజ్యభ్రష్టుడవై కష్టిదుమ లనుభవింపగలవన జయసేనుండు గడుచింతించి యొకపెట్టెలో జంద్రమతినుంచి యాపెటికను నదిలో విడిచిరి యంత నాపెటిక నదిలో స్నానమాడుచున్న మయబ్రహ్మను సమీపించిన నతండామందసమును విప్పిచూడ నాదేవి మయుని పాదములమీద నొరగ నతండు కనికర హృదయుండై చంద్రమతిని మంగళవతి వగుదువుగాకయని దీవింప నాకన్య యోమహాత్మా! మీరు పుణ్యపురుషులగుట మీదీవెన వ్యర్థము కాగూడదు గనుక నన్ను ధన్యురాల జేయుండని తన వృత్తాంతం బెరింగించి చేతులు జోడించి నిలిచిన నామయుండు యోగదృష్టిని సంగతి దెలిసికొని అమ్మా! నిన్ను పుత్రికగాభావింతు నీకొరంత దేవుండు దీర్పగలడని యూరడించి యామెను దోకొని పోయి తన పుత్రికయగు మండోదరిని బిలిచి అమ్మాయీ ! యీమె నీచెల్లెలు. పేరు చంద్రమతి మీరిరువు రనుకూలముగానుండుడన వారలనురాగముతో వర్తింపుచు జనకుండాపలకుబోయి వచ్చునెడ తండ్రికి నెదురుగజని సంతసపెందవింపుచు దినములు గడుపుచుండిరి అంత నొకదినంబున హరిశ్చంద్రుండు వేటకయివచ్చి మండోదరీ చంద్రమతు

లంకాధి యందు చంద్రమతియం దనురాగమేర్పడి తనయూహం దెలుప నయ్య యది యుచితంబుగాదు మాతండ్రినడిగి పెండ్లియాడుట న్యాయంబని బలుక నాతం మరియు మారుపలుకలేక మరల యింటికిచనిరి అంత నాచంద్రమతి భూపతిపయింగల మోహంబున చింతింపుచు తాను తండ్రికి యెదురుగ బోవమిచే మయుండు అమ్మా ! సుందరీ ! నేడు నీచెల్లెలురాని కారణంబేమని యడుగ నాసుందరి జరిగిన సంగతి తెలియింప నతండు కడుసంతసించి యొక శుభదినంబున మునిపుంగవుల రావించి హరిశ్చంద్రునకు చంద్రమతినిచ్చి పెండ్లిగావింప వధూవరులు లేచి ఋషులకు నమస్కరింప వారలావధూరత్నమును దీర్ఘసుమంగళీభవయని దీవింప నయుండు వారల నవలోకించి తపోధనులారా ! యీచిన్నదానిగాథ యిట్టిది మీదీవెన రిత్తబోగూడదన నామునులు యోగదృష్టివలన సంగతితెలిసి వారలేకముఖంబున నీచంద్రమతి మంగళసూత్రము భర్తకుదప్ప పరులకు గానరాకుండునటుల దీవించిచనిరి. తత్కారణమున చంద్రమతి మంగళసూత్ర మొరులకు గానరాదు.

సమాప్తము.

---

